వ్యాకృతిక నైఘంటిక మర్మములు మాత్రమే తనగ్రంథమందుఁ గనుపఱచక లోకజ్ఞానము, వివిధవస్తు పరిచయముఁ జాలవిషయములలోఁ జూపించెను. ఈగ్రంథమందలి వేటవర్ణనము మనుచరిత్రమందలి వేటవర్ణనమున కింతమాత్రము తగ్గదు. ఈవిషయమున ధూర్జటికవియే యెక్కువ ప్రశంసనీయుఁ డని నా తలంపు. పెద్దన్నవర్ణించినది రాజాకి నవేట. పెద్దన్న రాయలయాస్థానమునందలి కవిశేఖరుఁడై కృష్ణరాయలతో నెల్లప్పుడు తోడునీడగనుండుటచే రాయల మృగయావినోదములను దఱచుగఁ జూడ నవకాశ ముండెడిది. కావున నాతనియాఖేట వర్ణనము సజీవముగా నున్నదనిన వింత లేదు. ధూర్జటి చేసిన వేటవర్ణనము చెంచులు మున్నగు నాటవికు లాడినవేటలు. వానిని దిలకించుటకు, ఆకవి సప్రయత్నముగా బోయపల్లెలకుఁ బోయి వారితో నరణ్యముల కేఁగి యట వారి జీవితములను జూచినఁగాని యింత స్వాభావికముగాను మనోహరముగాను వర్ణించియుండ లేఁడు. ఇప్పటికాలపుఁ గవులవలెఁ గాక ప్రాచీనకవులు ప్రత్యక్షానుభవము లెట్లుసంపాదించి తమగ్రంథములయందుఁ జేర్చుచుండిరో యిట్టి విషయములనుబట్టి మనము గుర్తింపఁగలము. ఆధునిక కవులలోఁ గూడఁ గొంతమంది సముద్రములుగాని, అరణ్యములుగాని, యెన్నడును జూడకయే దీర్ఘవర్ణనలు చేయుచుందురు. అట్టి వర్ణనలు నిర్జీవములగు మాటల ప్రోగులు మాత్రమే యని వేఱె చెప్పనక్కఱలేదు. ధూర్జటికవి చేసిన స్వాభావికవర్ణనలకును, జూపిన వస్తువిజ్ఞానమునకును గొన్ని యుదాహరణముల నిటఁ బొందుపఱచెద.

## —* జంగమ దేవర వర్ణనము *—

సీ. అడుగుసెత్తమ్ముల నపరంజిపావాలు
కరమునఁ గేదారకంకణంబు

బంగారుప్రాత చెఱంగులగోణాము
గళమున రుద్రాక్షకంఠమాల
యొకకేల భసితభస్త్రికతోడిబెత్తంబు
సందిగట్టిన తరుణేందుధరుఁడు
మాణిక్యరుచుల యొడ్డాణంబు భూతిపైఁ
బెట్టిన కస్తూరిబిళ్ళబొట్టు
సార్వకాలికతాంబూలచర్వణార్ద్రి
రాగసౌభాగ్యమునఁ బద్మరాగమణులఁ
దృణముగాఁ జూచు దంతపంక్తియును గలిగి
యంగజారాతి యొకమిండజంగ మగుచు.

—♦ సాలిపురుగుపట్టులు ♦—

శా. ప్రాతఃకాలతుషారశీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసఁగు తద్బిందుచ్ఛటాజాతఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహుశతోద్దీర్ణగేహంబులై
లూతాకల్పితతంతుసద్మములు వొల్చుం జెప్పఁ జిత్రంబులై.

—♦ చెంచులమద్యపానవర్ణనము ♦—

* *

సీ. మాటలాడఁ దలంచి మఱచిపోయెడువారు
నడవఁబోవుచుఁ దొట్రుపడెడువారు
నూరకుండెద మని యుండనోపనివారు
లేచెద మని లేవలేనివారుఁ
బనిలేనిపని బట్టబయలు దిట్టెడువారుఁ
బాడనేరకయును బాడువారు
నెదురైనవారికి నెల్ల మ్రొక్కెడువారు
వ్రీడావిహీనులై యాడువారుఁ

విన్న మందులు తా నరి కన్నమందు
లడిగి తెచ్చినమందులు నడవిమందు
లెన్ని చేసిన మానక యింకుమాలి
కన్ను తోడిఁ బడి నెత్తురు గాఱుటయును.

మూఁడవయాశ్వాసమునందలి వేఁటవర్ణనమును, శూలిప్రవర్ణనమును గొంచెము దీర్ఘములుగా నుండుటచే నిట నుదహరింప మానితి. వానిని జదివినయెడల నీమహాకవి యెంతయనుభవశాలియో యెంతయెక్కువగఁ బ్రపంచవిజ్ఞానమును సంపాదించుకొనెనో మనకు స్పష్టముగ బోధపడఁగలదు. ఇది భక్తిరసప్రధానమైన దివ్యక్షేత్రసంబంధమగు గ్రంథమైనను దీనియందు ననేకరుచులును, ననేకరసములును ననేక విధములగు లోకానుభవములను నీమహాకవి చేర్చి సుమనోమనోజ్ఞమగు కావ్యముగ నొనరించినాఁడు.

## కావ్యశైలి

ధూర్జటికవి తనశైలి "నవ్యభాషా శతధా నిగుంభన రసస్థితి" నుండునని ప్రారంభముననే చెప్పెను, తన ప్రపౌత్రుఁ డగు లింగరాజకవి యీతని కవిత్వశైలినిగుఱించి "సార సుధాసార సరసోక్తిగుంఫన" మని వర్ణించెను. కృష్ణరాయలసభయం దీతనిశైలి "అతులిత మాధురీ మహిమ" గలిగినదని యుగ్గడింపఁబడినది. ఇట్లెవ్వరు కొనియాడినను ఈతని శైలియందు రసోద్గతి గలదనియే నుడివిరి. ఈతని శైలియందు మాధుర్యగుణము ముఖ్యలక్షణముగ నుండిన ట్లగపడదు. మాధుర్యగుణమే మన:—

తే. గీ. రసయుతం బగుమధురంబు రసము మాటు
లందుమఱి వస్తువునను బొల్పారుచుండు;
మధువుచే మధువ్రతములమాడ్కి విబుధు
లలరుచుండు శబ్దానిచే నదియె రసము (కావ్యాదర్శము)

మాధుర్యగుణము రసలక్షణములలో నొకటియై భావయందును వస్తువునందును సమానముగ నుండును. అట్లు లేనిచో మాధుర్యగుణ లక్షణ మాగ్రంథమునకు వర్తించదు ధూర్జటికావ్యమందు మాధుర్య గుణము భావయందుఁ బ్రత్యేకముగఁ గానరాదు. వస్తువునం దెక్కు వగఁ గానరాదు. కావున మాధుర్యగుణము దీనియందు ముఖ్యముగ నున్నదని చెప్పుట పొసఁగదు. పారిజాతాపహరణమున మాధుర్య గుణము భావయందును, గథావస్తువునందును సమానమున నున్నట్లు గాంచినాము. కావున ముక్కుతిమ్మన్నకవనమందు మాధుర్యము ముఖ్యలక్షణమని చెప్పినను నొప్పును. ఈకావ్యమందుమాత్ర మది వర్తించ దని నాయభిప్రాయము. ఆకారణముననే కృష్ణరాయలసభ యందలి ధూర్జటి విషయ మగు సమస్యాపూరణము కొంటెవాని పని గాని కవియొక్క నిజప్రభావమును దెలుపునది కాదని నేను నిరసించితిని.

ఇంక ధూర్జటికవనశైలి యెట్టి దనిన:—రసభరితమై, ధారాళ మై, బలాఢ్యమై, నవ్యభాషాశతధా నిగుంభితమై, తీరాంచలముగఁ బ్రవహించెడు మహానదీప్రవాహమువలె మందము గాక, యుద్వేలము గాక సమానరయోద్ధతిని బరుగిడుచున్నది. భావములు, భాషయు, తూకము గలిగి సమానగౌరవమును బొందియున్నవి. మాధుర్యమును, ఓజస్సును సమానభాగములుగఁ బంచుకొనియున్నవి. సంస్కృతపద భార మెక్కుడుగా నుండుటచేఁ బాండితీప్రయాసకులకుఁ దప్పక మెప్పుఁ గలిగించుచుండును. అయినను నీతనిసంస్కృతభాష శ్రీనాథునియందు వలెను తెనాలి రామకృష్ణునియందువలెను, నైఘంటికగహ్వరముల నుండి యూడి రాలినదిగాక తఱచుగ సామాన్యపండితవర్గము వాడుచుం డుటచే సులభగ్రాహ్యమైనదిగ నున్నది. కావున విషయార్థము సుబో ధ్యమై, శీఘ్రవేద్యమై హృద్య మగుచున్నది. ఆకాలపు మహాకవు లం

దటివలెనే యీతనికూడఁ దనకవితకుఁ బ్రత్యేకలక్షణ మియ్యఁగలిగెను. పెద్దన్న ప్రౌఢమగు రసస్ఫూర్తిఁ గలుగఁజేసి చిత్రకారుఁడు ధగద్ధగితము లగు వర్ణములతోఁ జిత్రపటములను వ్రాసినట్లు తననిరుపమానశబ్దమహిమచే చక్షుశ్శ్రోత్రములకు సమానసౌభాగ్యము గలుగఁజేసెను శైలిని నేర్పఱచుకొనెను. ముక్కుతిమ్మన్న సులలితమైన పదవిన్యాసముతో శ్రోత్రప్రియమగు మృదుమధుర మైన శైలిని జూపించెను. నృసింహకవి అర్థగాంభీర్యమును, వచఃప్రాగల్భ్యమును జతపఱచి సమయోచిత నైపుణ్యముగల శైలిని యుపయోగించెను; కృష్ణదేవరాయలు విషయ ప్రాధాన్యముఁ జేసికొని రాచరికపుహృదయసంయమము నభ్యసించి రసగుంభిత మై, నిబిడమైన పదకూర్పు గల శైలిని ప్రకటించెను.

ఇంక ధూర్జటికవి వీరివలెఁగాక రసస్ఫూర్తియు, శబ్దపటిమయు సమానముగ నుండునట్లును, విషయము సుగోచరముఁ జేయుచు ప్రౌఢ శబ్దప్రయోగము ఏకధాటిగ నడచునట్లును శబ్దార్థసమగౌరవము గల, రసవంతము గల శైలి నుపయోగించెను. ఈతని శైలియందు మాధుర్యముతో నోజస్సును, సౌలభ్యముతోఁ బుష్టియు, వేగముతో గాంభీర్యమును జతపడి యున్నవి. ఏభాగ మెచ్చోట విప్పి చదివినను మై పులకరింతలు గలిగించు రసోత్సేకము తప్పక యనుభవమునకు వచ్చును. దీర్ఘవర్ణనలలోఁ దీటికగాఁ గూర్చొని పద్యముల నల్లుటయు, భావములఁ బునఁచుటయు—నీతనిపనిగాదు. కథాప్రణాళికను విద్యుల్లత మెఱసినట్లు చకచక నడపించుచు మధ్యమధ్య వర్ణనభాగములను గూడ కథలోనున్న రసవేగముననే సంధానించి కథనోత్సాహము, అమంద తరంగసంగతమున నుప్పొంగినరీతిని నిర్వహించుకొనెను.

"సత్యభాషా శతధా నిగుంభన రసస్థితి"

అని తన శైలినిగుఱించి కాళహస్తీశ్వరుఁ డన్నమాట లీతనికవిత

కెంతయుఁ దగియున్నవి. సంస్కృత శబ్దముల నింత హృద్యముగాను చోద్యముగాను వాడినకవి యాకాలమందు చింతలపూఁడి ఎల్లనార్యుఁడుతప్ప మఱియొకఁడు కానరాఁడు. సమకాలికుఁ డగు తెనాలి రామకృష్ణుఁడు గూడ సంస్కృతపదభూయిష్ఠ మైన శైలిని యుపయోగించెను. కాని, యది శ్రీనాథునివలె కఠినపదగ్రథితమై తఱచు దుర్భేద్యముగ నున్నది. అంతియగాక, ధూర్జటియందలి రసవద్విసరణము గూడ రామకృష్ణునియందుఁ గాన్పించదు. బహుశః ఈ కారణముచేతనే గాఁబోలు కొంటెకవియగు రామకృష్ణుఁడు రాయలసభయందు ధూర్జటి నిగుఱించి సమస్యాపూరణముఁ జేయుచు నాతని మాధురీమహిమ సుకుమార వారవనితా సంగతివలనఁ గలిగె.నని సపహాస్య గర్భితవ్యాజస్తుతిఁ జేసియుండును.

ధూర్జటియొక్క శైలిని దెలియఁజేయుటకు మచ్చునకై కొన్ని పద్యముల నిటఁ జూపుచున్నాను.

శా. ఓ వెఱ్ఱీ ! సుతు లందఱుం దగిన సద్యోగ్య గంభీరులై యోగతిన్
జావం బుట్టువుదీఱునే ? మనములో సంసారమున్ గోసినన్
దేవోత్తంసునిఁ బార్వతీరమణు, భక్తిం గొల్వవీ చేకుఱున్
జీవన్ముక్తి య టంచు ధాత్రి యుపదేశింపం బ్రమోదంబునన్

శా. శుండాలార్భకషండగండతలఖర్జూఘర్జనోపాస్తనా
ఖండగ్రావము చండకుండలివిశంకవ్యాప్తి కింపైన శ్రీ
ఖండస్థాణువు శారికా శుక విహంగ వ్రాత పుండ్రేక్షు కో
దండక్రీడకు నీడమై తప మతిస్థైర్యంబునం జేయఁగన్.

సీ. వామాంగభామినీ శ్యామధామాళియుఁ
గంటహాలాహలకాళిమంబు
నాకాశకేశపాశాసితచ్ఛాయయుఁ
జాళికాసింధు శైవాల రుచియుఁ

గళకృష్ణసారాగ్ని ఘనధూమనీలిమ
 శేషభూషణ ఫణాసీమ నలుపుఁ
గటితటీకీలిత కరటిచర్మద్యుతి
 మేచక శూలశోభాచయంబు
భువనలోచనుపై నెత్తిపోవు నంధ
కారబృందమునకుఁ దోడు గాఁగఁ గూర్చి
వెనుక నేతెంచు భూతేశువిధము దనరఁ
జంద్రుఁ డుదయాద్రిపై నొప్పె సాంద్రకాంతి.

మ. మదమాతంగము సింధురార్భకముతో మార్కొంచుఁ జెల్లాడు పెం
పుదయింపన్ లయకాలతాండవకరుం డుప్పొంగి గాండీవితోఁ
గదనం బిట్లొనరింప నాతఁడు భుజాగర్వంబు మాత్సర్యము
న్వదలం జాలమిఁ జాల మెచ్చి శివుఁ డంతన్ దివ్యతేజంబుతోన్.

అలంకారముల నచ్చటచ్చట కొలఁదిమాత్రముగ వాడి, రుచి చూపించెను. ఆయా స్థలములలో నవి సమయోచితముగ నుండి రస పోషకములుగా నున్నవి. ఈతని కావ్యరసము అలంకారములమీఁద నాధారపడి యుండలేదు. కాన, వానివాడుకకు నెక్కువ యవసరము లేకపోయెను. భావోద్రేకము సహజలక్షణముగ నున్న యా కవి వరుఁడు స్వాభావిక రచనముచేతనే తా నిచ్ఛగించిన కావ్యశోభ యంతయుఁ జేకూర్పఁ గలిగెను, ఉపమారూపకములు కొలఁది మాత్ర ముగఁ గాన్పించుచున్నవి. ఉత్ప్రేక్షలు తఱచు వర్ణనల భాగములందే గానవచ్చును. అవియుఁ జాల మితముగాను, సమయస్ఫూర్తిగాను వాడఁబడెను. శబ్దాలంకారములగు శ్లేషయమకానుప్రాసములు బహు కొద్దిగా నున్నవి. ఏ యలంకారముల నైనను నతిచాపల్యముగ వాడి యుండలేదు. కావున నితని కవిత్వము సహజమైన పుష్టియు, హృష్టియుఁ గలిగియున్నది. ఇది యుద్యానవనమువలె నానావర్ణ ద్రుమములును,

కుసుమ స్తబకములును, కీరశారికా నిష్కూజితములను గలిగి నయన శ్రవణోత్సుకముగ నుండెను, గంగా యమునా తరంగిణుల సంగమంబున, వీచికా నినాదమధ్యంబున నవగాహము జేయు యోగిపుంగవుని కెంత హృదయానందము గలుగునో యట్టి యపారసంతుష్టి యీ కావ్యమునఁ గలుగఁగలదు.

అలంకారములు దెలుప నొండు రెండు పద్యముల మాత్రము చేర్చెదను.

—: రూ ప క ము :—

క. భయ మను తొల్లికన్ విమలభాగ వసుంధరఁ జెల్లగించి భ
క్తి యనెడు విత్తుఁ బెట్టి వ్రతఘనది సమ్మదవారిఁ జల్లగాఁ
నయమున నంకురించుచు ననల్ గొనలై యెలమిం జెలంగి త
న్మయముగఁ బ్రాఁకె నం చనఁగ నారుల మై పులకంబు లేర్పడన్.

వెన్నెలవర్ణనఁ జేయునపుడు కృష్ణదేవరాయలకాలపునాఁటికవులు తత్పూర్వకవులవలె చకోరపు పేరంటాండ్రు గుజ్జనగూళ్ల క్రీడలను వర్ణించుట యొక యాచారమైనది. ఈ వర్ణనమున నొకరినిమించిన ట్లొకరు ప్రయత్నించుచుండిరి. బహుశః కావ్యసౌకుమార్యమున కిది గొప్ప నిదర్శనముగా నుండి కవిప్రతిభను విశదము చేయఁగలదని యాకాలపుఁ గవు లీవర్ణనముగూర్చి యంత యభిమానముఁజూపిరి కాఁబోలు!

చ ం ద్రి కా వ ర్ణ న ము :—

1 చ. వెన్నెలగుజ్జనంజుకొని వెన్నెలపోరివు భుజించి, నాలిక
న్వెన్నెలగొజ్జుఁ జాలఁ గొని వెన్నెలతేటలఁ ద్రావి వేడుకన్
వెన్నెలకారును జుజ్జుకొని వీథులయందుఁ జకోరదంపతుల్
మిన్నులు ముట్టి వెన్నెలలు మేపుచు। బిల్లలు దాము నాడఁగన్.

(కాళహస్తిమాహాత్మ్యము)

II సీ. విరహుల పైఁ సోఁకి వేఁడి యా వెన్నెలఁ
బచ్చివెన్నెల నులివెచ్చఁ జేసి

కలువపుప్పొడులచేఁ గసటైన వెన్నెల
వలిపవెన్నెలలోన వడిచి తేర్చి
చంద్రకాంతపునీట జాలైనవెన్నెల
ముమురువెన్నెల జొజ్జుఁ బదను చేసి
సతుల మైపూఁతం బిసాళించువెన్నెలఁ
దనుపువెన్నెల రసాయమునఁగూర్చి
చిగురువిలుకానిజాతర సేయఁ బూని
కొలముసాముల నందఱఁ గూడఁబెట్టి
వంతు గలయంగ బువ్వంపుబంతి విందు
పెట్టి రేలమిఁ జకోరపుఁ బేరఁటాండ్రు.

(పారిజాతాపహరణము)

111 సీ. మొలకవెన్నెలుచాలు గలపి నెచ్చెలులకు
సూడిదగా నిచ్చి యాడు నొకటి
గుజ్జువెన్నెలఁ గొ్రచ్చుకొని తెచ్చి చుట్టాలఁ
బిలిచి విందులువెట్టి మలయు నొకటి
తీఁగవెన్నెలతీఁగె దిగిచి వేతునకలు
సేసి వల్లభ కిచ్చి చెలఁగు నొకటి
చిగురువెన్నెలఁ దుంచి మగనికుత్తుకఁ బ్రేమఁ
గూర్కొని కూర్కొని గునియు నొకటి
లప్పవెన్నెలకుప్ప బాలలకుఁ జూపి
మేఁత వెట్టించి కెలఁకుల మెలఁగె నొకటి,
కేలిఁ జంద్రోదయోత్సవ శ్రీలఁ బొదవెఁ
గోరికలు మిన్నుముట్టఁ జకోరకములు.

(శ్రీరాధామాధవము)

ఈ విధమైన చంద్రికావర్ణనము అనంతామాత్యుని భోజరాజీయమునందును, జక్కన విక్రమార్కచరిత్రమందును గూడ నున్నది. గ్రంథ విస్తరభీతిచే వాని నిచ్చటఁ జేర్చలేదు.

## —* రసము—నీతి *—

నవరసభరితమగు నీకావ్యమందలి నీతిరసవిచార మించుక చేయవలసియున్నది. ఈకావ్యమందు ముఖ్యముగ భక్తిరసము గాన్పించుచున్నది. ఈభక్తిరసమునకు నంగిగా నున్న శృంగార వీర శాంతరసములు స్థాయిరసమున కుద్దీపకములుగ నున్నవి. ఆయారసము లన్నియు నెట్టి వికృతులు పొందినను సూత్రరూపముగ నున్న భక్తిరస మాయావికారములకు నింపుసొంపులు గలిగించుచున్నది.

శృంగారరసము మాయాజంగమరూపుఁ డగు పరమేశ్వరుఁడు సౌందర్యరాశియైన దాసియింట విడియముచేసిన కథాసందర్భమునఁ నావిర్భవించినది. ఈకథాభాగము నేఁటికాలపు భారతీయుల మగు మనకు మనోజ్ఞముగ నుండకపోవచ్చును. కాని, యిట్టిస్వైరశృంగారవిహారములు శివకేశవుల కిద్దరకును ధర్మాచరణములే యని మనపూర్వులు నమ్మియుండిరి. కావున వారియం దిట్టికార్యము లేహ్యములుగ, గాన్పించియుండలేదు. కావున నిట్టిశృంగారగాథల నైతిక విచారముఁ జేయుట మన కప్రస్తుతవిషయము. పరమేశ్వరు లగు శివకేశవుల కాముకచర్యలు మన పురాణాంతర్గతములుగ నెన్నియో యున్నవి. వానిని గుఱించి కేల్మొగిడ్చి మిన్న కుండుటయే లెస్స యని నా తలంపు.

తరువాత శృంగారరసము తాపసమిథున మగు అగస్త్య లోపాముద్రల తీర్థయాత్రాసందర్భమునఁ గోచరించుచున్నది. మహాముని యగు నగస్త్యుఁడు తనసహధర్మచారిణితో దేశసంచారముఁ జేయుచు నదీపర్వతముల దాఁటుచున్నప్పు డెట్టిపవిత్రప్రేమఁ జూపించెనో యాదృశ్యము వర్ణనాతీతము.

ఉ. చేరఁగఁబోయి యాత్మసరసీరుహలోచన కేలుపట్టి వ
క్షోరుహకుంభభారమున సూక్ష్మవలగ్నము పీడఁ బొందఁ బొం

దారయువృత్తి రమ్యగుచు నాదరణంబునఁ దోడుకొంచు విం
ధ్యాద్రి తదగ్రభాగమునఁ గల్లన నెక్కె ఖురాగ్రధారలన్.

శృంగారరసమందలి మూఁడవపట్టు బ్రహ్మసరస్వతుల కేళీవిషయముఁ జూపట్టుచున్నది. ఈయుపకథ యీపుణ్యక్షేత్రసంబంధము కాకపోవుటచేఁ గొంత యప్రస్తుతమైనను గవి తత్కథావిలీనములైన శృంగార వీర శాంత కరుణారసముల వర్ణనావకాశము గలుగుటకుఁగాను ఎట్లో కథను నతికిపెట్టినట్లూహింపవలసియున్నది. ఆయాసందర్భముల వర్ణన లన్నియుఁ గవిచే బహుమనోహరములైనవి. బహుసంక్షేపముగను జేయఁబడియుండుటచే నీభాగ మెన్నిమారులు చదివినను దనివి తీరక యుండును. ఈ నాజూకుతనము లేక, మొరటుగా నున్న శృంగారము బోయపల్లెయందలి చెంచు, చెంచెతల మద్యపానాదేశ మదక్రీడలలోఁ జాల హృద్యముగా నభివర్ణింపఁబడినది.

విపులశృంగారరస వర్ణనాసందర్భము మాకవికి శివభక్తిపరాయణలగు వేశ్యకన్యల యుపాఖ్యానమునఁ గలిగినది. ఆయవకాశముఁ జిక్కించుకొని ధూర్జటి మహాకవి వారవనితల శృంగారక్రియలును, విటవిటీజనముల సంచారములును, పణ్యస్త్రీల సంపర్కదోషమును మున్నగు వానిని తదితర రాంధ్రకవులు వారిగ్రంథములలో వర్ణించినట్లు తానును గొంత వివరించి వ్రాసెను. ఇచ్చోటనైనను ఈమహాకవి తనసహజ సంక్షేపకసౌశీల్యము తప్పలేదు. ఈఘట్టములు బహుసంక్షిప్తముగఁ జెప్పి విడిచిపెట్టియున్నాఁడు. సుంకసాల నృసింహకవివంటివాఁ డైనయెడల రెండుమూఁడురెట్లు దీర్ఘముగ వర్ణించియుండవలసినది. ఇట్లు రసనిగ్రహముఁ జూపఁగలిగిన కవివంద్యునిగూర్చి వారవనితాసక్తుఁ డను నపప్రథఁ గల్పించుట నాకెంతయు విచిత్రముగఁ గాన్పించుచున్నది. శృంగారరసవర్ణనములో నీకవి యసహ్యముగను, అవినీతికరముగను నుండు

న క్లిచ్చుటను జపలదృష్టిని దీర్ఘప్రసంగములు గావించినట్లు చూడము.

శృంగారరసవర్ణనముకంటె వీరరసవర్ణనమునం దీకవికి ఎక్కువ ప్రాభవ మున్నదని నా యభిప్రాయము. రామకృష్ణుని యారోపణ మన్యాయ మని చూపుట కిదియు నొకయుపపత్తి యే. వీరరసము మొట్ట మొదట బ్రహ్మపుత్రుఁడైన యుగ్రుఁడు తనతమ్ము లగు ముప్పదివేల రక్కసులతోఁ బోరుసలిపి వారిని సంహరించినసందర్భములోఁ బొడసూపినది. ఆయుద్ధవర్ణనము చాల రసోద్రేకముగ నుండుటయేగాక విరాటపర్వంబున నర్జునుఁ డొక్కరుఁడును కౌరవానీకముతోఁ బోరు సలిపిన తెఱంగును గొంతవఱ కనుకరించుచున్నది.

క. విడువక పట్టిన మును మున్
గడతేఱిచి బలము రెండుగా నొనరించెన్
నడి నా రెంటికి నడుమన
నెడలెన్ మఱి సోమసూర్యవీథులు గాఁగన్.

(కాళహస్తి మహాత్మ్యము)

మ. ఇదిగో వర్గము సేరవచ్చితిమి పో నింకేల సైన్యంబులన్
గదియన్ వే చనుదెంచె రెంటినడుమం గాఁ ద్రొచ్చి యీవచ్చు న
న్నదవీరావళికిన్ భుజావిబలవిన్యాసంబుఁ గాన్పించి మా
న్చెద గర్వంబు మరల్చెదన్ బళుల నా చేఁ జిక్కురా కెమ్మెయిన్.

(తిక్కనభారతము-విరాటపర్వము)

అటుతరువాత శివపూజనోత్సాహమున సాలెపురుగు దీపకళికను వీరావేశముస గ్రమింగఁబోవుటయు సర్పమును, హస్తియు నన్యోన్యసంహారముకొఱకు సరభసముగఁ బోరొనర్చుటయును వీరరసముఁ దెల్పుచున్నవి. మృగవ్యాళముల పెనఁగులాటయైనను మహాయోధుల మల్లయుద్ధమువలె రోమహర్షణోత్సాహములు ముప్పిరిగొనునట్లు వర్ణించి కథనాకౌతుక మక్షీణముగ సాగునట్లు చేయఁగలిగెను. ఇంక వీరరసాసారపుంజీ

కృతజ్వాలాకీలరో యనునట్లు అభీలాహవ కేళిని తిన్ననిపూర్వజన్మ వృత్తాంతమున నిక్కవి వర్ణించెను. తిన్నఁడు ప్రాగ్జన్మమున పాండవ మధ్యముండని తెల్పు సందర్భమున కిరాతార్జునీయకథ నంతను అద్భుత సంగ్రహముగ నభివర్ణించెను. కైతవ కిరాతపురారాతియు, తపోనియమ మునవున్న పాకశాసనియు నెట్లు దలపడి యన్యోన్య విజిగీషులై ససంభ్రమముగ మార్కొనిరో యాయుదంతమును ప్రబంధాంతమున వర్ణించి యీ కావ్యభవనమునకు మిన్నుముట్టు మహాసౌధమును నిర్మించెను. ఈ యుపాఖ్యానమును భారతమున నన్నయభట్టు రచించిన యాయుపాఖ్యానముతో సరిచూచి చదివిన నీకవీశ్వరుని శైలీపటిమ తెల్లమగును. పరంతరములగు పదమార్గణములను దన యక్షయతూణీరములనుండి యిరుగ్రేవల గురిపించుచున్నట్లు, ఈకవి సవ్యసాచి యభివర్ణించి యీచిన్నకథ నొక యద్వితీయ వీరకథానకముగా నొనరించెను.

ఉ. సూనశరారియు న్నముచి సూదనపుత్త్రుఁడు దివ్యబాణసం
ధానమున న్మహాహవము దప్ప మెలర్ప నొనర్ప నొప్పెఁ దిం
తైనఁ గొంతలేక తమ యందలి తేజము మిన్ను ముట్టఁగా
భానుఁడు భానుఁడుం జటులభాను పరంపరఁ బోర్వుకైవడిన్,

శాంతకరుణారసములు భక్తిరసమునకు స్వభావసంబంధము గలిగి యుండుటచే గ్రంథమం దనేకచోట్ల ననుకూలముగఁ జూపింపఁబడినవి. యాదవ భూపాలుని కఠినశాసనమున కేశములు గోల్పోయిన దాసికూతురు కరుణారసమొలుకుచున్న పలుకులును, ఆజన్మవిరాగులగు తిన్నఁడును వేశ్యకన్యలును జూపించిన యద్భుత శాంతస్వభావమును ఈ కవి గ్రామణియొక్క కథనానైపుణ్యమును విస్పష్టముగఁ బ్రకటించుచున్నవి.

అశ్లీలములగు భావములను బెంచక నీతిమర్యాదల నతిక్రమింపక సదా రసోత్సేకమున రచించుచున్నను నీకవివర్యుఁడు మితభాషియై పరి

మిత వర్ణనలతో సమస్తరస భావములఁ జిత్రించి తన గ్రంథమును ప్రతి పద్య హృద్యముగ రచించి యామూలాగ్రముగఁ బఠనాకౌతుకమును నిర్వహింపఁగలిగెను.

## పాత్రపోషణము.

ప్రపంచవిజ్ఞానమును, వివిధ మానవజీవిత పరిచయమును విశేషముగఁ గలిగిన యీకవి తన గ్రంథమందలి పాత్రపోషణ మెట్లు నిర్వహించెనో తెలిసికొనఁగుతూహలము గలుగవచ్చును. ఈ కావ్యమందలి పాత్రపోషణము ఆముక్తమాల్యదయందువలెనే భగవంతుని నిర్ణయముమీద నాధారపడి యున్నది. కాని కవియొక్క స్వాతంత్ర్యములో నుండ లేదు. భగవద్భక్తి పూరితములగు నీయుభయ గ్రంథములయందును గథాపాత్రములుగానున్న స్త్రీపురుషులందరు భగవంతుని చేతిలో జంత్రపుబొమ్మలుగా నాడవలసినవారేగాని యంతకంటె వారికి వ్యక్తిస్వాతంత్ర్యము లేమియు నుండ వీలులేదు. ఆముక్తమందు కేశవుఁడును దీనియందు శివుఁడును దమ యద్భుత శక్తులను జూపుటకే పాత్రలను నిమిత్తమాత్రములుగా నుపయోగించినవారు. విష్ణుచిత్తునివలె శివబ్రాహ్మణుఁడును, మాలదాసరివలె వేశ్యాసోదరులును, గోదాదేవివలె తిన్నఁడును సదా దైవభక్తి ప్రేరితులై సామాన్య మానవజీవితమునకు విదూరులై యాజన్మ యోగులవలె ముముక్షుమార్గముననే పెరిగి కష్టములనన్నిఁటిని దైవసహాయమునఁ దొలగింపఁజేసికొని చిట్టచివరకు దైవసాయుజ్యమును బడసినవారైరి. ఇంక పశుకీటకములలోఁ జేరిన సాలిపురుగు, సర్పము, ఏనుఁగును గురించి వేరె చెప్పనవసరములేదు. ధర్మజ్ఞాన శూన్యమైన తిర్యగ్జన్మమున నుత్పన్నములైన యీజంతువులు దైవనియోగమున భగవదారాధన పరులై మోక్ష సామ్రాజ్యము నధిష్ఠించినవి. ఇట్లు కీట

కాది మనుష్య పర్యంతము భగవచ్చింతన తప్ప వేరొండు జీవితాశయము లేనికారణమున పాత్రపోషణమున కెట్టి యవకాశము లేదు. కావున నే యీగ్రంథము ఆముక్తమాల్యదకుఁ బోటీగా వ్రాయఁబడినట్లూహింప వచ్చునని మొదటనే సూచించితిని.

ఈగ్రంథమందలి పాత్రలయొక్క సౌశీల్యాది గుణములు భగవంతునిచే నిర్ణీతములైనను వారి క్రియాభాషణముల విషయములలో నీకవి స్వభావసిద్ధమగు నిరూపణముఁజేసి పాత్రపోషణమునందు గొంతవఱకు అధికారము వహింపఁగల్గెను. జంగమదేవరను దన యింటి కాహ్వానము చేసినపుడు దాసిపడుచు తత్కార్యోచితమైన కన్నడభాషా పదములను జక్కగవాడెను. జంగమదేవరులకుఁ గన్నడదేశమే పీఠస్థానముగాన వారి విషయమై యాభాషయే స్వభావోచితము. అట్లే తిన్నఁడు జననమొందిన బోయపల్లె యందలి చెంచు చెంచితలను వర్ణించినపుడును, వారి వేఁటలను దేవతారాధనలను వర్ణించినపుడును వారాడెడు అపభ్రంశ భాషనే సముచితముగా నుపయోగించెను. దానివలన నాటవికుల పాత్రపోషణము గొంతవఱకు సాధింపఁబడినది.

ఇట్లవకాశము గలిగినపుడెల్ల నీకవి తన కావ్యమున యథావద్వర్ణనములుచేసి యాయాపాత్రలను వారివారి జీవితములకు సరిపోవునట్లు చూపింపఁ బ్రయత్నించుచుండెను.

## —♦ కవి ప్రతిభ ♦—

ధూర్జటి కవిత్వమందు బలము, ఓజస్సు, కాంతియు స్వభావోక్తితోను మాధుర్యముతోను గలిసి యున్నవి. మార్దవమును, లాలిత్యమును కదాచిద్దృశ్యములు, భక్తిపారవశ్యము మెండైనను ఇతర రసము

లను యథార్థముగఁ జిత్రించెను. భాషావైదగ్ధ్యమపారమైనను పదవాక్య ప్రమాణము సర్వత్ర నిలుపుకొనెను. రసోద్రేకము స్వభావలక్షణమైనను, ఔచిత్యజ్ఞానముచే దానిని యుద్వేలముగాకుండ జేసెను. ఇంద్రియ భోగ విలాసముల రుచి పూర్ణముగఁ దెలిసియున్నను ముక్తి మార్గసాధనచే దానిని నిగ్రహించెను. ఇట్లు భక్తాగ్రేసరుఁడుగాను కవీశ్వరుఁడుగాను తాను లోకోపకారముకొఱకు నిర్వహింపవలసిన విధులను శ్రద్ధతోను ఔచిత్య దృష్టితోను సామర్థ్యముతోను నెఱవేర్చి సమకాలికులగు కవులలో సర్వతోముఖ సౌమనస్యముఁ జూపఁగలిగెనని నాయభిప్రాయము.

# అధ్యాయము

## వెన్నెలకంటి సూరన్న—విష్ణుపురాణము

కృష్ణదేవరాయల కాలములో నాతని సామ్రాజ్యమందు నొక చిన్న సంస్థానమునకుఁ బ్రభువుగా నుండిన రావూరి రాఘవరెడ్డి యను నతనికి నంకితముగ వెన్నెలకంటి సూరన్న యను కవివరుఁడు విష్ణుపురాణమును పద్యకావ్యముగాఁ దెనిగించెను. విష్ణుపురాణము వ్యాస రచితములగు అష్టాదశ పురాణములలోఁ జాల ముఖ్యమైనది. ఈ పురాణము కేవలము వైష్ణవ మతమునకు ముఖ్యాధారములలో నొకటి యగుటయే గాక హిందూదేశ చరిత్రమునకు నాధార భూతములైన గ్రంథములలోఁ గూడఁ బ్రాముఖ్యము నొంది యున్నది. దీని యందున్న పూర్వ హిందూరాజ వంశావళులు ప్రస్తుతము తామ్ర శిలా శాసనాదికముల సహాయమునఁ జరిత్ర పరిశోధకులచే నిర్ణయింపఁబడిన వంశావళులకుఁ జక్కఁగ సరిపోవుచున్నవి. కావున విష్ణుపురాణము మత విషయము నందును దేశ చరిత్ర విషయ మందును నగ్రస్థాన మలంకరింపఁ దగినది.

ఈ విష్ణుపురాణమును సూరన్నకుఁ బూర్వమును తరువాతను గొందఱు కవులు తెనిఁగించిరి. పశుపతి నాగనాథుఁ డను ప్రాచీనాంధ్ర కవి పదునాల్గవ శతాబ్దాంతమున దీనిఁ బ్రథమమునఁ బద్యకావ్యముగాఁ దెనిఁగించినట్లు గాన్పించుచున్నది. ఆ గ్రంథ ముత్సన్నమైనది. ఒండు రెండు పద్యములు మాత్రము లక్షణగ్రంథములలో జొప్పడి యుండుటచే దక్కినవి. ఆ పద్యములను జూచిన నాతని కవిత్వము మన ప్రాచీనాంధ్ర కవుల మహత్తర శయ్యగల కవిత్వమునకుఁ దీసి పోదని చెప్ప

వచ్చును. ఈ క్రిది పద్యము నాగనాథుని వి[illegible]నందలి దని ప్రబంధ రత్నావళిలో నున్నది.

ఉ. మాసర మమ్మ్యనంత మధుమాసము హంసవిలాసినీ జన
త్రాసము పుష్పబాణనవరాజ్య విలాసము వల్లరీ వధూ
హాసము మత్తకోకిల సమంచిత పంచమనాద మండిమ
వ్యాసము జీవలోక హృదయంగమ సౌఖ్య వికాస మెంతయున్.

దీని తర్వాతం గాల క్రమమున జూచిన మన వెన్నల కంటి సూరన్నదే రెండవ భాషాంతరీకరణము. సూరన్నకు నించు మించుగ సమీప కాలమునను సమీప స్థలములోను నుండిన కలిదిండి భావ నారాయణ యను కవియు విష్ణుపురాణమును గొంతవఱకు అనఁగా శ్రీకృష్ణ జననము వఱకుఁ బద్య ప్రబంధముగాఁ దెనిఁగించెను. పం దొమ్మిదవ శతాబ్దములో నిద్దరు కవు లీగ్రంథము నాంధ్రీకరించిరి. వా రిద్దరు కళ్లేపల్లి నరసింహమూర్తియు, తాడేపల్లి సీతారామస్వామియు. ఇవియుఁ బద్యకావ్యములే. వీరిలో సీతారామస్వామిగారు ఉత్తర భాగమును మాత్రము తెనిగించిరి. ఇంక విష్ణుపురాణమును వచనరూపముగ తుపాకుల అనంత భూపాలుఁడును, నోరి గురులింగ శాస్త్రి యును రచించిరి. ప్రస్తుతము పద్యరూపమున ననువదించిన వానినే నేను విమర్శించుటచే నీ గద్యరూపానువాదములను బరిశీలించుట లేదు.

ప్రకృతము నా యొద్ద పద్యకావ్యములగు ఆంధ్ర విష్ణుపురాణ ములలో సూరన్న, భావనారాయణ, సీతారామస్వామి కవులు రచించి నవి మాత్రమే యున్నవి.

సూరన్నయు, భావనారాయణయు నించు మించుగా నేక కాల ములో నీ గ్రంథమును రచించిన వారగుటచే వారి కృతుల తారతమ్య మునిరూపించుట న్యాయమును అవసరమును. ఈ విషయమును సమ్య క్పరిశీలనముచేసి కోరాడ రామ కృష్ణయ్యగారును, పింగళి లక్ష్మీకాం

తముగారును వీక ముఖముగా మదరాసు విశ్వ విద్యాలయ ప్రచురణ మగు భావనారాయణకవి కృతమైన విష్ణుపురాణమునకు వారు రచించిన పీఠికలో నిట్లు నివేదించిరి. "ఈపురాణమును మూలము తోడను వెన్నెలకంటి సూరన్న విష్ణుపురాణము తోడను బోల్చి చూచితిమి. తెలిచి చూడఁగాఁ దెనుఁగు పురాణములలో నంత యథా మాతృకమైన రచన యేఁ గన్పట్టదు. వెన్నెలకంటి సూరన్న విష్ణుపురాణము భారతాదుల వలె మూలమునకు యథోచితానుసరణమే గాని దీనివలె యథా మాతృకము గాదు, తనకుఁ బూర్వము సుప్రసిద్ధమైన యొక విష్ణుపురాణము తెనుఁగున నుండఁగా దానును నా గ్రంథమే రచింపఁ బూనుటలో నీ కవి సంకల్పము స్పర్ధాహంకార ప్రేరితము గాక మూల విధేయతను సంపాదించు కోర్కెవలన గలిగి యుండును. నేఁడు బ్రహ్మశ్రీ వేద మూర్తులైన కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారి భారత రచనా సంకల్పము వంటిదే యీ భావనారాయణ కవి సంకల్పమై యున్నది. ఇందీతఁడు కృతార్థుఁడయ్యె ననియే చెప్పవచ్చును. ఎచనెడ గొలది మూలాతి క్రమణము లున్నను నవి యంతగాఁ బాటింపఁ దగినట్లుగా నగపడవు. "కావున వెన్నెలకంటి సూరన్న రచించిన విష్ణు పురాణముతో దృష్టి నొందక భావనారాయణ తన గ్రంథమును రచించినట్లు తేలుచున్నది. యథా మాతృకత్వమే యాతని కృతి యందలి ముఖ్యవిషయము. మాతృ కానుసరణమే ముఖ్యోద్దేశముగా నున్న భాషాంతరీకరణములందు సామాన్యముగ రసావిష్కరణమున కవకాశము తగ్గును; రచనము కూడా నొకించుక గుంటు వడియుండును. భావనారాయణ కవిత్వము నీరసమని చెప్పుటకు వీలులేదు గాని సూరన రచనకు మొత్తము మీఁదఁ గొంచెము తగ్గునేమో యని నేను భావించు చున్నాను. సూరన్న సుప్రసిద్ధ మహాకవి వంశములోఁ బుట్టిన కవియై పంప్రదాయ

సిద్ధముగ వచ్చిన కవిత్వసరసత్వమునఁ బరిఢవిల్లెను. కావున నీతని కవిత ధారాళమై నిరర్గళమై మృదు మధురు పదగుంఫితమై యొప్పు చున్నది. పురాణమును సహితము సుకుమార కావ్యముగానే యీకవి యనువదించెను. అనగా స్వేచ్ఛాను సారముగఁ గుదించియు, పెంచియు, మార్చియు దాను స్వతంత్రముగ భాషాపరివర్తనము చేసెను. తన రచనయందు ముఖ్యముగ సౌలభ్యమును సౌకుమార్యమును స్వారస్యము నుండునట్లు గ్రంథమంతయు సాగించెను. కావున నీతని గ్రంథముఁ జదివి యానందించుట కెక్కువ యవకాశమున్నది. భారత రామాయణముల యందలి తొలి యాంధ్ర కృతులన్నియు నిట్టివి యే కదా!

కృతి కర్త యగు వెన్నెలకంటి సూరన వంశమునకును కృతి భర్త యగు రావూరి రాఘవరెడ్డి వంశమునకు ననేక పురుషాంతరముల నుండియు పోషక పోషితమగు నవినాభావ సంబంధ ముండినది. "కవిత పుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు" అని 'శ్రీకృష్ణ విజయకర్త' యగు వెన్నెలకంటి వెంకటాచల కవి నుడివి నట్లు వెన్నెలకంటివారు కొన్ని శతాబ్దముల నుండియు నాంధ్ర కవులుగా పేరొందిరి. మొదటివాడైన వెన్నెలకంటి సూరన్న అద్దంకి ప్రభువగు అనవేమారెడ్డి యాస్థానములో కవిగానుండి యాప్రభువువల్ల ననేకాగ్రహారములను బహుమానములుగా బొందెను.

చ. వెన్నెలకంటి సూర్యుడు వివేక గుణాఢ్యుడు వేదశాస్త్ర సం
పన్నుడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్న కవీంద్ర కుంజరు డకుంఠిత తేజుఁడుఁ పెద్దతండ్రిగా
సన్నుతిగన్న సిద్ధనకు సంతత దావకశావినోదికిన్.

అని జక్కనకవి తన విక్రమార్క చరిత్రమందుఁ జెప్పెను. ఆ వంశములోఁ బుట్టిన సిద్ధనమంత్రి విక్రమార్క చరిత్రమును గృతినొం

తెను. అటుతర్వాతఁ గొంత కాలమువఱకు తద్వంశమందలి కవులను వారి గ్రంథములను గురించి యిదమిద్ధమగు విషయము మనకుఁ దెలియదు. ఇటీవల వెన్నెలకంటి అన్నయ్య యను కవిషోడశ కుమార చరిత్రమను ఆంధ్ర ప్రబంధమును రచించెను. ఆతఁడా వంశములో నెన్నవవాఁడో తెలిసికొనుటకు సాధనములు గానరావు. ఈ వంశమును గుఱించి సూరన్న వ్రాసిన మాటలు వినిన వంశ పారంపర్యముగ నాంధ్రకవిత్వము వారియింట నివాస మేర్పఱచుకొన్నదని నమ్మవచ్చును.

ఉ. ఈనిఖిలంబు మెచ్చ నమరేశ్వర దేవుఁడుమాడఁ గృష్ణవే
ణీనది సాక్షిగాననికి నిల్చిన రావుతు రేసభూవిభుం
గానకుఁదోలి వెన్నడచి కాల్చిన వేమయయన్న పోతభూ
జానక ప్రత్యబంధము లొసంగిన వెన్నెలగంటివారలోన్.

(కేతక. ప. 22)

వెన్నెలకంటివారు కావ్యములు వ్రాయుటయుఁ దమ ప్రభువులగు రెడ్డిరాజులకుఁ గృతులొసంగుటయు జరుగుచునే యుండెను. అనూచానముగా వారి వంశములో వచ్చుచున్న యీయాచారమునకుఁ బ్రఖ్యాత ఫలము యీవిష్ణుపురాణము. దీనిని మొదట వెన్నెలకంటి సూరన్న వంశములోనివాఁడైన యీసూరన్న అనవేమారెడ్డి వంశములోనివాఁడైన యీరావూరి రాఘవరెడ్డి కంకితముచేయుట బహు సమంజసముగా నున్నది. కృతికర్తయు కృతిభర్తయు సగౌరవముగాను, ససంతోషముగాను నీవిషయమును వెలిబుచ్చుకొనిరి.

## —♦ కృతిపతివంశము. ♦—

రావూరి రాఘవరెడ్డి అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరము రాజ్యములనుఁ బరిపాలించిన దేసటి వంశమువారైన రెడ్డిరాజులవంశము

లోనివాడు తన పూర్వుడు అనవేమారెడ్డియని ఈక్రింది పద్యమువలన దెలియుచున్నది

ఆ. అట్టి పంటకులంబునందు నే డవ చక్ర
వర్తి యన్న వేము వసుమతీసు
డుద్భవించి కీర్తియును ప్రతాపంబు
నెసగ భూమియెల్ల నేలుచుండె

క. తన బ్రతుకు భూమిసురులకు
తన బిరుదులు పంటవంశ ధరణీశులకున్
తన నయము భూమిప్రజలకు
నన వేమనయిచ్చె గీర్తినధికుండగుచున్.

అనవేమారెడ్డి ఇంటిపేరు దేసటివారని శ్రీనాథుడు మున్నగు కవుల వలనః దెలియుచున్నది. ఈ రాఘవరెడ్డి యింటిపేరు రావ్వూరివారు. వీరు రావ్వూరు పట్టణమున కధిపతులుగా నుండుటచే నీపేరు వచ్చినట్లీ గ్రంథమువలననే తెలియుచున్నది. ఈ రావ్వూరు నెల్లూరిజిల్లాలో కందుకూరు తాలూకాలో నున్న రావ్వూరుగాని వీరేశలింగంపంతులు గారు చెప్పినట్లు గుంటూరు, కొండవీడు మధ్యనున్న రావ్వూరుకాదు. ఏలయన దేసటి వంశమునకు సంబంధించిన వారందఱు ముఖ్యముగా పాకనాటిసీమలోనున్న పట్టణముల కధిపతులుగా నుండి యాగ్రామముల పేళ్ళు తమ యిండ్లపేళ్ళుగ నుంచికొనిరి. అలాగుననే రాఘవరెడ్డి పూర్వులకు రావ్వూరను యింటిపేరు వచ్చినది. ఈ రావ్వూరి రాఘవరెడ్డి రాజధాని అద్దంకికి ఒంగోలునకు మధ్యనున్న గుడ్లూరు పట్టణము. ఈ పట్టణము పూర్వము ఆంధ్ర భారతారణ్య శేషముః దెనిగించి కవిత్రయము వారిలో నొకడుగా గణింపఃబడిన చదలువాడ ఎఱ్ఱాప్రగడ యొక్క నివాసస్థానముగా నుండినది. ఎఱ్ఱాప్రగడ ఆగ్రామము నిట్లు వర్ణించెను.

సీ. ...ఘుల బాకనాటిలో నీలకం
ఠేశ్వర స్థానమై యొసక మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠతనొప్పు
ధన్యుఁడు ధర్మైక తత్పరాత్ముఁ
తే. గీ. డెఱ్ఱనార్యుండు.............. (భారతము ఆరణ్య 7 ఆశ్వాస 469)

వెన్నెలకంటి సూరన్న దానినే యిట్లు వర్ణించెను.

సీ. గౌరీసమేతుఁడై గరిమతో నేవీట
నేపారు నీలకంఠేశ్వరుండు
వారాశికన్యతో వర్తించు నేవీట
గిరిభేదినుతుఁడైన కేశవుండు
యోగినీ సహితయై యొప్పారు నేవీటఁ
బసిఁడి పోలేరమ్మ భవునికొమ్మ
పాపవినాశయై ప్రవహించు నేవీట
మిన్నేఱు మిన్నేటి మారటగుచుఁ
ఆ. గుంజరములు వేయి గొలువంగ నేవీట
గొడుగు చక్రవర్తి పుడమియేలె
నట్టిరాజధానియై యొప్పు గుడ్లూరి
నొనర నేలుచుండి యొక్కనాఁడు. (అవతారిక. ప 16)

కావున వెన్నెలకంటివారికిని ఎఱ్ఱాప్రగడకు నెట్టి కుటుంబబాంధవ్యముండియుండెనో దీనివలన స్పష్టమగుచున్నది. ఎఱ్ఱాప్రెగడయందీ కవికి గల పరమోత్కృష్టమగు భక్తిని సూచించెడు మఱియొక చిన్న నిదర్శన మీగ్రంథమందుఁ గాన్పించుచున్నది. సర్వసామాన్యముగ నాంధ్రకవులు కవిత్రయము వారిని స్తుతించినప్పుడు కాలక్రమ వ్యత్యయముఁ జేయక నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడలను వరుస క్రమమునఁ గీర్తించుట యాచారము. ఈకవి యా యాచారమునకు భిన్నముగా వారినిఁ బేర్కొని యాక్రమమును దల్లకిందుఁ జేసెను.

ఉ. ... ... ... ... ... ... ... ...

నెన్నికగాఁ బ్రబంధపరమేశ్వరుఁ దిక్కనసోమయాజినిన్
నన్నయభట్టు భాస్కరుని నాచనసోముని రంగనాథునిన్
వెన్నెలకంటిసూర్యుఁ బదివేలవిధంబులఁ గొల్చి భక్తితోన్.

(పీఠిక 9)

ఈక్రమమును దప్పించుట నెఱ్ఱాప్రగడను తెనుఁగు కవులందఱి కంటెఁ బ్రథమమునఁ జేర్కొనుటకే యని విస్పష్టమగుచున్నది. కావునఁ బ్రబంధ పరమేశ్వరుని పాదరేణువులతో బవిత్రతమైన సారస్వత సేమయగు గుణ్ణూరియందుఁ గవులకుఁ బుట్టిన యిల్లైన వెన్నెలకంటికులము వాఁడైన సూరన్న యీ విష్ణుపురాణమును రచించి యీ యుభయ కవి వంశములకుఁ దొలుతనుండియు బ్రాపకులైన రెడ్డిరాజుల సంతతిలోని వాఁడైన రాఘవరెడ్డికి నంకితము సేయుట యెంతయో యొప్పిదముగా నున్నది. ఈసందర్భములో మరియొక వైచిత్ర్యము జూపఁదగియున్నది. తన పూర్వపు మేటియాంధ్రకవులనుఁ బేర్కొని స్తుతించి శ్రీనాథుని నామముఁ జేర్పకపోవుట విచిత్రముగా గన్పట్టకమానదు. శ్రీనాథుఁడు కేవలము శైవగ్రంథములను రచించిన వాఁడగుటచే నైనను మతావలంబియగు రాఘవరెడ్డికి నిష్టము గాకుండుటచే గవి విడిచిపెట్టెనో లేక రాఘవరెడ్డి పూర్వులకును శ్రీనాథుని పోషకులగు కుమారగిరి పెదకోమటి వేమారెడ్లకును గల కుటుంబ వైషమ్యముచేత విడిచిపెట్టెనో మనము నిశ్చయముగాఁ జెప్పఁజాలము. శ్రీనాథుని పేరు విడుచుట మాత్రము నిర్హేతుకముగాదు.

రాఘవరెడ్డి వంశము అనవేమారెడ్డివంశమునకు సంబంధించినదని మాత్రము దెలియవచ్చుచున్నది. కాని ఆ సంబంధ మెట్టిదియో గ్రంథమందు వ్యక్త పరుపఁబడలేదు. పుత్రపౌత్రాదికమా, లేక దుహితృ

దౌహిత్రాదిక మాయదియని నిర్ణయించుట కాధారములు గాన్పింపవు. రాఘవరెడ్డి గోత్రము యానసపాల గోత్రము; దేసటివారి గోత్రము తెలియరాకున్నది. వీరిదిగూడ నదియే గోత్రమైనయెడల రాఘవరెడ్డి వేమారెడ్డియొక్క పుత్రసంతతిలోని వాడగును. రాఘవరెడ్డి తండ్రి తాతలు శైవమతస్థులుగా నుండినట్లు గాన్పించుచున్నది. రాఘవరెడ్డి తండ్రియు బినతండ్రియు పంగులూరి యనయ్య యను శైవాచార్యుని శిష్యులు. రాఘవరెడ్డిమాత్రము శైవము విడిచి వైష్ణవమును స్వీకరించెను. ఈతడు తిరుమల తాతాచార్యుల వంశస్థుడగు సింగరాచార్యుని శిష్యుఁడు. రాఘవరెడ్డి వంశవృక్ష మిట్లున్నది.

అనవేమారెడ్డి
అతని వంశమున

లింగారెడ్డి

అనమారన (పాకనాటిలో) — పేరమరెడ్డి

అనమారన
|
పెమ్మ

పేరమరెడ్డి
|
తమ్మారెడ్డి (× మాచమాంబ)

అన్న వల్లభ చింత గంగ (అమలాంబ ×) బసవన్న అన్నారెడ్డి లింగారెడ్డి

రాఘవరెడ్డి తమ్మారెడ్డి లక్ష్మారెడ్డి

రాఘవరెడ్డి కాలము నిర్ణయించుటకు రెండు శాసనములున్నవిఁ వానినిచ్చట జేర్చుచున్నాను. ♦ వానినిబట్టి చూడగా నతఁడు కృష్ణదేవ

## —♦ మొదటి శాసనము. ♦—

1. శ్రీమతే రామానుజయ
2. నమః॥ స్వస్తిశ్రీ జయాభ్యుదయ

రాయల కాలపువాఁడని స్పష్టమగుచున్నది. కావున వెన్నెలకంటి సూరన్నకూడ నాకాలపు వాఁడేయై యున్నాఁడు.

---

3. శాలివాహన శకవరుషంబులు
4. ౧౪౮౦ అగునేట్టి సర్వధారి సంవ్వ
5. త్సర ఆషాఢ శు ౧౧ అ నాముద్యున
6. నాకిశ్వరి అఖిలాండకోటి బ్రహ్మాం
7. డ నాయకుండైన వెలిగొండ శ్రీ తిరువెం
8. గళ్నాతస్వా- మివారి దాసులు రావూరి రాగా
9. వరాంశింగారంను వెలిగోటి రంగనా
10. యి. కొమారుండు విమానాయి
11. నంగారయ అనంత్తైన ప్రిండ్డముకు
12. సమర్పించి యిచ్చిన ధర్మశా
13. సం మద్దిరికిం కెల్లమానరూకా
14. త్రిలోకిన్ని ఒనకగిరి ముసునూరి పోలన
15. గ్లకు కెల్లనాగడిపల్లిగ్రామము
16. కొండ్ర మురుసయ్యవారికిని రావూరి
17. బసువారెడింగారికిన్ని వెలిగోటి రం
18. గా నాయనింగారికిన్ని పుణ్యము
19. గాను అగ్రరంగ వైభవాలకున్ను అమ్మ
20. దపల్లికున్ను ఆచంద్రార్కస్థాయిగాను
21. యీ గ్రామంసూంకం చూపుటోయుం
22. మొదలుగాను దేవునికి దారా
23. వోసి సమర్పించ్చి యిస్తిమి యీ
24. పుణ్యానకు యెవ్వరు తప్పినవా
25. రినాను తమ మాతృపితృలా
26. మునవారిని గోవును బ్రాంహ్మ

రాఘవరెడ్డి తండ్రితాతల సందర్భములో నొక చిత్రవిషయము గుర్తింపవలసియున్నది. తన తండ్రి బసవరాజనియు తన తాత తమ్మయ్య యనియుఁ జెప్పుచు, తండ్రియగు బసవరాజు ఉదయగిరి రాజ్యము గజపతులచేతను కర్ణాట రాజులచేతను గౌరవ బిరుదములును బొందినట్లు చెప్పుకొనెను.

సీ. కటకాధిపతియైన గజపతిరాజుచేఁ
బ్రతిలేని పల్లకీపదవి నొంది
మహిమచేఁ గర్ణాట మండలాధిపుచేతఁ
గడలేని రాజ్యభాగములు గాంచెఁ
బ్రౌఢపౌరుషమున రాజిల్లి మెఱయఁగా
మలకవజీర్ల కుమ్మరికఁ జేసెఁ
దెలగాణభూములఁ గల మన్నెవారిచే
బలవంతమునను గప్పములు గొనియెఁ
తే. జాటుధాటీ నిరాఘాటఘోటకావ
ళీఖురోద్ధూత నిబిడధూళీ విలిప్త
మండితాశాంగనాకుచమండలుండు
బాహుబలశాలి తమ్మయబసవవిభుఁడు (అవతారిక ప. 41)

రాఘవరెడ్డి తండ్రి తాతలగు బసవయ, తమ్మయలవలెనే ఆ యా పేర్లతో నిద్దఱు తండ్రికొడుకులు ఉదయగిరిరాజ్యమందే యాకాలముననే రాజ్యముచేసి యుండిరి. వారును గజపతులవల్లను, కర్ణాటక రాజులవల్లను అనేకములగు గౌరవములను బొందియుండిరి. వారిద్దఱు తమ్మభూపతియు బసవరాజును. వీరును కృష్ణదేవరాయుల కాలమునను దత్పూర్వమునను ఉదయగిరిరాజ్యమేలిరి. వీరు క్షత్రియులు. వీరింటి పేరు కుంటముక్కలవారు. వీరిలో బసవరాజు మాబగుంట నారాయణ కవి రచించిన పంచతంత్రమును గృతినొందెను. కావున రెడ్డివంశజులగు

తమ్మయ బసవయలను క్షత్రియవంశస్థులగు తమ్మయ బసవయలుగా నూహించి పొరబడకూడదు. క్షత్రియులగు తమ్మయ బసవయలు ఉదయగిరి రాజ్యమంతయు నేలిరి. వారిక్రింద రెడ్డివంశస్థులగు నీ తమ్మయ బసవయలు సామంత సంస్థానాధిపతులుగానుండి పరిపాలించుచుండిరి.

—♦ కృతికర్త విషయము. ♦—

వెన్నెలగంటి సూరన్న ఆపస్తంబ సూత్రుఁడును హారితస గోత్రుఁడునగు బ్రాహ్మణుఁడు. ఆతని తండ్రి యమరమంత్రి. అతనికి చెఱుకూరి యమరమంత్రియని సూరన పేరుపెట్టినాడు. బహుశః యీ యమరమంత్రి గుంటూరుజిల్లాలోనున్న చెఱకూరు గ్రామమునకుఁ గరణీకము చేయుటచేతనో లేక ఆగ్రామమందు స్థిరనివాస మేర్పఱచుకొనుటచేతనో యీ విశేషణమును బేరునకుఁ జేర్చినాఁడు. సూరకవి తాత వెన్నెలకంటి సూరన్న. ఈసూరన్న అనపోతారెడ్డికిఁ గృతులిచ్చిన వెన్నెలకంటి సూరన్న కెన్నొవ తరమువాఁడో నిశ్చయముగాఁ జెప్పలేము. కృతికర్త తనతల్లిపేరు చెప్పుకొనలేదు. కృతినాయకుఁడగు రాఘవరెడ్డివలన బసవపురమను నగ్రహారమును గ్రహించి తద్గౌరవమునకుఁ బ్రతిగౌరవముగఁ దన విష్ణుపురాణము నతని కంకితముఁ జేసెను ఈవిషయములను గ్రంథప్రస్తావనయందు తాను చెప్పుకొనెను.

సీ. భవ్యచరిత్రు నాపస్తంబమునిసూత్రు
శుద్ధసారస్వత స్తోత్రపాత్రు
హారితగోత్ర పవిత్రు నాంధ్రభాషాకావ్య
రచనాభినయ విశారదుఁ బ్రబంధ
కర్తను వెన్నెలకంటి సూర్యుని మను
మని జెఱుకూరి యమరయామంత్రి

సత్ప్రవృత్తి వాక్ఛాస్త్రవిచిత్రబుద్ధి

ధుర్య కవిత్వ చాతుర్యశీలు

తే. నిజకులాచార మార్గైక నిష్ఠుఁ డరయ

స్వాత్మబోధము వ్యాసకృత వైష్ణవపురాణ

వేది సారస్య విద్యాప్రవీణు సుకవి

మాననీయుని సూరనామాత్యవరుని (పీఠిక. ప. 23)

ఈసూరన వంశములోనివాఁడగు వెన్నెలకంటి వెంకటాచలకవి శ్రీకృష్ణవిజయమను ప్రబంధము రచించి దానిలో నీసూరన్ననుగుఱించి కొంతప్రశంసచేసి తన వంశవృత్తము నిట్లుచూపెను.

సీ. సూరప కాంతిచే సూర్యప్రకాశుండు

వేదాది విద్యల వెలసినాఁడు

విష్ణుపురాణంబు వేడుకఁ దెనిఁగించి

విపులయశంబున వెలసినాఁడు

తాపూరిబసవన్న రమణతో నిచ్చిన

యలవెంగునూరగ్రహారమందె

తెలుగోటి తిమ్మవిభునిచేఁ గొనియెంజా

నాందోళికాచ్ఛత్రమగు వదలని

తే. కవితపుట్టిల్లు వెన్నెలకంటియిల్లు

ననెడు పౌరుషనామధేయంబు నిలిపె

సరసగుణములుఁగలిగిన సాధుసుకవి

మాననీయుండు సూరనామాత్యవరుఁడు.

ఈసూరన్న కుమారుడు లక్ష్మన్న. అతని కుమారుడు చక్రప్ప. వాని కొడుకు గంగయ్య. వాని కొడుకు సూరపరాజు. అతని కొడుకు జగ్గన్న, అతని పుత్రుడు వెంకటాచలకవి. కావున విష్ణుపురాణపు సూరనార్యునకు వెంకటాచలకవి యారవ పురుషుడు. సూరన్న

బసవాపురమును రాఘవరెడ్డినుండి యగ్రహారముగాఁ బొందెనని చెప్పుకొనెను. వెంకటాచలకవి రాఘవరెడ్డి తండ్రియగు బసవన్నయే కవికి మొగల్తూరు అగ్రహార మిచ్చినాఁడని చెప్పినాఁడు. బహుశః మొగల్తూరునకే బసవాపురమను నామాంతర మేర్పఱచినాఁడేమో.

## —♦ గ్రంథవిషయము. ♦—

హిందూమతమందలి త్రిమూర్తులలో రెండవ వాఁడగు మహావిష్ణుని చరిత్రమునుఁ దెల్పు నీగ్రంథము అష్టాదశ పురాణములలోనిదని మొదటనే చెప్పితిని. మహావిష్ణుని ప్రశంస విపులముగ హరివంశమునఁ గూడ నున్నది. దానిని సమగ్రముగ మొదట నాంధ్రీకరించినవాఁడు ఎఱ్ఱాప్రెగడ. అతఁడు సూరన్నకు సతిమాన్యుఁడు. కావున నీ విష్ణుపురాణాంధ్రీకరణములో సూరన్న ఆంధ్ర హరివంశమును సూక్ష్మదృష్టితోఁ బఠించియే యుండును. విష్ణుని చరిత్రమును విపులముగా వర్ణించెడి మఱియొక గ్రంథముగలదు. అది శ్రీమద్భాగవతము. దానిని బమ్మెర పోతనామాత్యుఁడు సూరన్నకుముందే తెనిఁగించి ఆంధ్రుల కమృతప్రాయముగ సిద్ధపఱచి యుండెను. దానినిఁగూడ సూరన్న పఠించియేయుండును. ఈగ్రంథత్రయమందలి రచనా తారతమ్యములను నిరూపింప నుద్దేశము నాకు లేదు. అది యనవసరమ్మనియని తలంచుచున్నాను. ఎఱ్ఱాప్రెగడ కవిత్వమునకు సాటిగా సూరన్న వ్రాయఁగలుగుట "తగరు ధరాధరంబుతో ఢీకొనుట" యట్లుండును. పోతన్న కవిత్వము తక్కిన మేటియాంధ్రకవుల కవిత్వపుదారినిఁ బోలేదు. అతఁడు స్వతోభవ్యసుకవిగానీ గురుశిక్షిత కవి గాఁడు. కావున భాషయందును భావములందును సర్వ స్వతంత్రుఁడుగా నుండెను. ఆంధ్రజనుల కొక పవిత్ర గ్రంథమును తెనిఁగించుచు సంస్కృతభాషకు డు, ము, వుఁలు మాత్రము చేర్చినట్లు

సామాన్యముగ గ్రంథమంతయును గీర్వాణభాషామయముఁ గావించెను ఆ గీర్వాణభాషమాత్రము మృదువైనదియు మధురమైనదియు శ్రవణానందమైనదియుఁ గావున నాతని రచనామార్గము చాలవఱకు విలక్షణముగాను సర్వస్వతంత్రముగా నుండినను దానినిఁ బఠించుటయందాంధ్రులు తనివితీరని యానందము నొందుచుందురు. సూరనార్యుని రచనకును పోతన రచనకును ఎవ్విధమైన పోలికయుఁ గాన్పించదు. ఎఱ్ఱాప్రెగడ ననుకరించి వాని పటుత్వమును ఔన్నత్యమును బొందలేక పోయినను వానిలక్షణములను గొన్నిటినిఁ గూర్పఁగలిగెను. బహుశః వెన్నెలకంటి వారి కవిత్వపు సొంపును ఎఱ్ఱాప్రెగడ కవి శ్రీయు గుణ్ణూరియందలి సన్నికృష్ట సాహచర్యమున ననురూపత ధరించినవేమో!

సూరనార్యుని యాంధ్రీకరణమును భావనారాయణుని యాంధ్రీకరణమును సంస్కృత మాతృకతో సరిచూచి శ్రీ కోరాడ రామకృష్ణయ్య పింగళి లక్ష్మీకాంతముగార్లు కలసి నిర్ణయించిన యభిప్రాయమును వెనుకనే కనఁబఱచితిని. భావనారాయణకవి మాతృకకు నత్యంతము చేరికగా నుండున ట్లను వదించినట్లును, సూరనార్యుఁడట్టి నియమమును బాటింపక పెంపు కుదింపులలో తన యిష్టమువచ్చినట్లు సంప్రతించికొని నట్లును నిర్ణయింపఁబడినది. వీరిద్దఱు చేసిన సిద్ధాంతమును పునర్విమర్శనము జేయుట పిష్టపేషణమని విడిచిపెట్టుచున్నాను. వీరు తమ సిద్ధాంతమును మాత్రము దెల్పిరి కాని వారు చేసిన నిర్ణయమును జూపెడు దృష్టాంతము నొకదానినైనను జేర్పు లేదు. కావున విష్ణుపురాణము నందలి ముఖ్యకేలక మగు నారాయణుని సర్వాంతర్యామిత్వము, సర్వాధార భూతత్వము విశదపఱచెడు నీ క్రింది భాగములను సంస్కృత పురాణమునుండి యుద్ధరించి దాని నుభయకవు లెట్లు తెనిఁగించిరో చూపెదను.

తారామయం భాగవతః శింశుమారాకృతిః ప్రభోః ।
దివి రూపం హరే ర్యత్తు తస్యపుచ్ఛేస్థితో ధ్రువః ।
సైష భ్రమన్ భ్రామయతి చంద్రాదిత్యాదికాన్ గ్రహాన్ ।
భ్రమంత మను తయాంతి నక్షత్రాణిచ చక్రవత్ ।
సూర్యాచంద్రమసౌ తారా నక్షత్రాణి గ్రహైః సహ ।
వాతానీకమయై ర్బంధైర్ ధ్రువే బద్ధాని తాసి వై ।
శింశుమారాకృతిప్రోక్తమ్ యద్రూపం జ్యోతిషాం దివి ।
నారాయణో౽యనం ధామ్నాం తస్యాన్ ధారః స్వయంహృది ।
ఉత్తానపాదపుత్రస్తు త మారాధ్య జగత్పతిమ్ ।
సతార శ్శింశుమారస్య ధ్రువః పుచ్ఛేవ్యవస్థితః ।
ఆధారశింశుమారస్య సర్వాధ్యక్షో జనార్దనః ।
ధ్రువస్య శింశుమారస్తు ధ్రువే భానుర్ వ్యవస్థితః ।
తదాధారం జగచ్చేదం సదేవాసుర మానుషమ్ ।
యేన విప్ర విధానేన తన్మమైకమనాః శ్రుణు ।
వివస్వా నష్టభిర్ మాసై రాదాయాపో రసాత్మికాః ।
వర్ష త్యంబు తత శ్చాన్నమన్నాద ప్యఖిలం జగత్ ।
వివస్వానం శుచీ స్తీక్ష్ణై రాదాయ జగతో జలం ।
సోమం పుష్ణా త్యథేందు శ్చవాయునాళమయైర్దివి ।
నాలైర్విక్షిపతే౽భ్రేషు ధూమాగ్న్య నిలమూర్తిషు ।
న భ్రశ్యంతి యత స్తేభ్యో జలా న్యభ్రాణి తా న్యతః ।
అభ్రస్థాః ప్రపతంత్యాపో వాయునా సముదీరితాః ।
సంస్కారం కాలచలితమ్ మైత్రేయాసాద్యనిర్మలాః ।

మ. అతులాకాశము సర్వమున్ దనమయంబై కాలచక్రంబుతో
సతతంబున్ హరినాత్మలో నిడి యతండెన్నన్ శింశుమారప్రజా
పతి త్రైలోక్య సమున్నతిన్ మకరరూపవ్యక్తి స్థైర్యయుతుండు వి
స్తృతుఁడై మీఁద ధ్రువుండు దా వెలుఁగుఁ దత్పుచ్ఛాగ్రదేశంబునన్.

తే. సతతమును శింశుమారాఖ్య చక్రమెపుడు
చంద్ర సూర్యగ్రహాది నక్షత్రసమితిఁ
ద్రిప్పుచును దాను నొక్కటఁ దిరుగుచుండు
నన్నిటికిమీఁద ధ్రువుఁడును నట్ల తిరుగు.

వ. సూర్య చంద్ర గ్రహ నక్షత్ర తారకా గణంబులు వాయునాశంబులచేత ధ్రువునియందు దృఢంబులై యుండును.

క. మును శింశుమారుఁ డగ్గా
త్మునకుఁ దపంబాచరించి జ్యోతిశ్చక్రం
బున నిల్చె ధ్రువుఁడు నవ్విధ
మున గొల్చి తదీయపుచ్ఛమున విలసిల్లెన్.

వ. కావున సర్వాధ్యక్షుండైన పుండరీకాక్షుండు శింశుమార చక్రంబునకు నాధారంబు. శింశుమారుండు ధ్రువునకు నాధారంబు. ధ్రువుండు సూర్యునకు నాధారంబు. సూర్యుండు సదైవాసురమానుషంబైన లోకంబునకు నాధారంబై సమస్తభూతలంబుల నన్నపానాదులఁ బరితృప్తులం జేయు నెట్లనిన.

చ. ఎనిమిది మాసముల్ రవి మహీవలయంబునఁ గల్గుతోయముల్
దన కిరణంబులందుఁ గొని తక్కినమాసచతుష్టయంబునన్
ఘనతర వృష్టిరూపముఁగా జలముల్ గురియింప లోకమె
ల్లను బరితృప్తిఁ బొందును జలంబును నన్నముఁ గల్గి పెంపుతోన్.

సీ. కాలాత్ముఁడైన భాస్కరదేవుఁ డాత్మీయ
చండాంశువులచేత జగతియందుఁ
గలిగిన సకలోదకములుఁ బీల్చి తెచ్చి
యమృతాంశుమండలమందు నునుచు

సాయుజ్యవైరియు వాయునాళంబుల
నాకాశభాగంబునందు దాఁచు
మారుత సలిలధూమజ్యోతిసంయోగ
మునఁజేసి జలధరంబులు జనించి

తే. వృష్టిసంస్కారకాలప్రవృత్తివలన
వాయుబంధంబులెల్లను వదలి నిండి
యున్న జలములు చెంగుఁ బయోధరముల
దానఁజేసియు జగతిని వానగురియు. (ఆ. 3 ప. 193—199)

## కలిదిండి భావనారాయణకవి :—

ఉ. ఆకమలాక్షురూపము నభోంతమున న్వెలుగొందు శింశుమా
రాకృతి తారకామయము నై మునివల్లభ వాని తోఁకపై
నేకద, యా ధ్రువుండు వసియించుట, తారకల గ్రహంబులన్
గైకొని త్రిప్పు మిందు నతిగాఢసమీరణపాశబద్ధుఁడై.

ఉ. ఆరయ శింశుమారతనుఁడైన జనార్దను మానసంబునన్
కోరి భజించు నా ధ్రువునకున్న కళగ్రహ తారకాళికన్
సారసపత్రలోచనుఁడు సర్వజగాదిభూతధారిగా
ధారణుగా నెఱుంగుము యథాకథనంబిది నీకుఁ జెప్పితిన్.

క. ఇనుఁ డెనిమిదిమాసంబుల
తనకరముల నవనిరసముతగఁ గైకొని నా
ల్గునెలల నొసఁగున్న నం
బనువుగ జీవించు ప్రాణులన్నియు దానన్.

చ. దినమణి వాయునాడిమయతీక్ష్ణ మయూఖచయంబుచే జలం
బౌవరగ సోమునందు నిడునుర్వర సర్వజలంబు లీలగై
కొని ఘనపంక్తిపై విడుచు కూడుక కాలమరుత్ప్రియుక్తతన్
ఘనములు భూమిపై విడఁచు గర్జిలుచున్ఘనవారి పూరముల్.

ఈ యిద్దరి కవుల మాంధ్రీకరణములోను మాతృకానుసారణ మందలి భేదము మాత్రమే గాక మరికొన్ని విధములగు భేదములు గాన్పించుచున్నవి. శైలియందును రచనాదృష్టియందును చాల వఱకు భేదమున్నది. భావనారాయణ కవియు సూరనవలెనే కొన్ని తావులలో మూలమును సంక్షేపించుటయుఁ జూడగలము. కావున నీతని యనువాదము ఆంధ్రవాల్మీకి యని పేరువడసిన వావిలకొలను సుబ్బారావుగారి యాంధ్ర రామాయణము వలెగాక అభినవ తిక్కన యని పేరుగాంచిన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి యాంధ్ర భారతము వలె నున్నది. మాతృకలోని స్వల్పాంశమైనను త్యజించక యనువదించిన వారే వీరిద్దరును. కాని భారతాంధ్రీకర్త యచ్చటచ్చట రసపోషణము కొఱకు కొన్ని స్వీయ భావములను జేర్చియు, కొన్ని వర్ణనలను పెంచియు తన కృతినిఁ జదివెడు వారి యందుఁ గావ్యరసాస్వాదనోత్సాహమునుఁ బుట్టింప సమర్థుఁ డయ్యెను. అట్టి భాషాంతరీకరణమే యీ భావనారాయణ కవిదియు.

సూరనార్యుని శైలి మృదువుగాను, ధారాళముగాను, మధురముగాను నున్నదని వెనుకనే చెప్పితిని. సెలయేటిలో నీరెట్లు నెమ్మదిగాను, చల్లగాను, నిరర్గళముగానుఁ బ్రవహించునో యట్లే యీ కవీశ్వరుని శైలీ ప్రవాహము, అప్రయత్నముగాను స్వాభావికముగానున్నది. పద్యములు చదువం జదువ నాశుకవితముగా నీప్రబంధమునుఁ జెప్పెనేమో యని యూహ పొడముచుండును. ఎచ్చటనైనను నొక శబ్దచిత్రము కొఱకు గాని యొక శబ్దాలంకారము కొఱకు గాని యీ కవి నిలిచియుండలేదు. రసావిష్కరణము కొఱకనుకూలించెడి కథలు వచ్చినప్పుడు వానిని సమగ్రముగా బరిశీలించుకొని చిన్న చిన్న నాటికలుగాఁ బెంచి రచించెను. అనగా కథాముఖము నుండి కథాంతము

వఱకును క్రమక్రమముగా రసోన్మేషణము గావించుచు రసోద్రేక మున్నతావస్థను బొందగానే క్రమక్రమముగా నుద్రేకమును తగ్గించుచు నాటకశక్తి నవలంబించెను. ఈ దృశంబగు రచనా విధానమునకు దృష్టాంతములు మారిష చరిత్రము, సౌభరి చరిత్రము, తారా శశాంకము, ఊర్వసీ పురూరవ కథ యిత్యాదులు. వీనిలో దేనిని జదివినను రసాత్మకమైన కవిత్వము నవ నవోన్మేషముగాఁ బ్రవహించుచున్నది. సూరన్న విష్ణుపురాణమును రసాత్మక కావ్యదృష్టితోఁ జూచి కావ్యకల రసాయనముగఁ దెనిఁగించెను. భావనారాయణకవి ప్రాయశః విష్ణుపురాణమును ఆధ్యాత్మిక పుణ్యచరిత్రముగఁ గైకొని భక్తి ప్రతిపాదనకొఱకు ప్రయత్నించి యాంధ్రీకరించెను. కావుననే ప్రహ్లాద, జడ, భరతాది భక్తుల చరిత్రలను విరివిగ పెంచియు తారాశశాంకోర్వసీ పురూరవాద శృంగార కథలను గ్లుప్త పఱచియు ననువదించెను. ఈ రెండు గ్రంథములయందు నిట్టిదగు రసభేద ముండుటయే గాక శైలియందును భేదమున్నది. భావనారాయణుని కవిత్వము ముదురు పాకము గలిగి భాషార్భటిగల శబ్దాలంకారములను గలిగి యున్నది. వెనుక దూబగుంట నారాయణకవి పంచతంత్రమును సాఫుశైలిని స్వాదుగా రచింపగా పర్వతరాజు వెంకటరాజు దానిని దృష్టి నొందక యా గ్రంథమునే ప్రౌఢ శైలిని కష్టముగా నుండునట్లు తెలిగించెను గదా! అట్లే యీ భావనారాయణుఁడును.

సౌభరిముని ముసిమిని సూరన్న కొలది మాటలతో సూచించి విడిచి పెట్టెను, "జర్జరితమైన శరీరము తోడఁ దద్దయున్, ముదిసిన వాడ వీవు..." భావనారాయణుఁ డంతటితోఁ దృప్తి నొందక యా వృద్ధ మహీశ్వరుని యెంత రోతగా వర్ణించినాడో చూడుఁడు.

సీ. ఉచ్ఛ్వాసతరసిరా ప్రచ్ఛాదిత శరీరుఁ
బరికంపమాన దుర్బలశిరస్కు
వాలంబమానవళీ లక్షితాననుఁ
శిథిలితనిపతితాశేషదశను
సంఛన్నపటల, మాసరితాక్షిగోళకు
శ్లేష్మఘుర్ఘుర శబ్దాశ్లిష్టకంఠుఁ
గోదండ దండభంగుర విరుద్ధాకారుఁ
బలితలోమశ్మశ్రు బద్ధకేశు

గీ. భూరినిర్ఝరతరంగ జరాభారజర్జ
రావయవునై, నమ్మునీంద్రుఁ గన్నారఁ జూచి
చూచి "యే, మాట చెప్ప నీకునశకించు"
నంచు నెంచుచుఁ జింతించెనవనివిభుఁడు. (ఆశ్వా 4 ప 65)

సూరన్న మానిముదిమిని యెక్కువగా వర్ణింపక కన్యల సౌందర్యము నెక్కువగా వర్ణించెను. భావనారాయణుఁడు తన స్వభావమునకుఁ దగినట్లు వ్యతిరేక కార్యమునుఁ జేసెను. సూరన్న చేసిన కన్యకా వర్ణనము.

ఉ. కాఱుమెఱుంగులో మెలపుఁ గైకొన నేర్చిన పైఁడిబొమ్మలో
మారునిదీములో కలికిమాటల చంద్రికలలో చెలంగు శృం
గార రసాధిదేవతలొ కమ్మని క్రొవ్విరి తీఁగెలో యనన్
వారిజపత్రలోచనలు వచ్చిరి మోహవిలాసమూర్తులై. (ఆశ్వా 5. ప. 146)

భావనారాయణుఁడు వీరిని వర్ణించుటయే లేదు. ఇట్లు రసవిషయమునను శైలీ విషయమునను వీరిద్దఱికిని భేదము స్పష్టముగాఁ గాన్పించుచున్నది. సూరన్న కవితా ప్రియుఁడు, భావనారాయణుఁడు పాండితీ ప్రియుఁడు. సూరన్న యందు శృంగారరస మెక్కువ, భావనారాయణుని యందు భక్తిరస మెక్కువ. సూరన్న శైలి యందు సౌకు

మార్దవమును, భావనారాయణ శైలి యందు ప్రౌఢిమయుఁ గన్పట్టు చున్నవి. తాడేపల్లి సీతారామస్వామి రచన నాతి సులభముగాను నాతికఠినముగాను యున్నది. శైలియందు గాని కల్పనయందు గాని ప్రత్యేక విశేషమెద్దియుఁ గానిపింపదు. పైనఁ జూపిన సౌభరి వృత్తాంత విషయములో ముదుసలి యగు ఋషి వర్ణనము గాని కన్యల లావణ్య వర్ణనము గాని లేకయే కథను సాగించి నాఁడు. దీనిని స్థాలీపులా కన్యాయమునఁ నిదర్శనముగా దీసికొనవచ్చును. కథా విషయములను తప్పకుండ నివేదించుట యే యీతని పని. అంతకంటెఁ గవితకు వేరె తోడవులు గన్పించుట లేదు.

సూరన్న కవిత్వము యింపు సొంపులు జూపెడు పట్టులు కొన్నిటి నగపఱచి యీ కావ్య విచారణ ముగించెద.

1. ప్రహ్లాదచరిత్రలో ప్రహ్లాదుని చదువును గుఱించి తండ్రి యగు హిరణ్యకశిపుఁడుఁ బ్రశ్నించుట :—

ఉ. ఏమిసుభాషితంబు పఠియించితిపుత్రక రాజనీతులే
యేమియెఱుంగఁ జెప్పె గురుఁ డిప్పుడు నీదగు పుస్తకంబునం
దేమిలిఖించె యున్నయది యిప్పుడు పాఠకశక్తిఁ జూచెదన్
మా మది కింపుఁగా జదువుమా యొక పద్యము వీరి ముందఱన్.

(2 ఆశ్వా. 280 పద్యం)

ఈ సందర్భములో పోతన్న భాగవతమందు వ్రాసినదియిట్లున్నది.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తియుత మే యుద్యోగమూగాఢసం
విత్సంపన్నుడఁవై తివే చదివితే వేదంబులన్ శాస్త్రముల్
వత్సా రమ్మని చేరఁజీరి కొడుకున్ వాత్సల్య సంపూర్ణుఁడై
యుత్సంగాగ్రముఁజేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపగన్.

(7 వ స్కంధం 139 పద్యం)

2 పారిజాతాపహరణ సమయమున సత్యభామ వనపాలకులతోఁ జెప్పిన మాటలు :—

క. ఎక్కడి దేవేంద్రుఁడు మఱి
యెక్కడి పౌలోమి వీరికి భూజాతం
బెక్కడిది లోకములో
నెక్కుడు వీరేలగైరి యెవ్వరికంటెన్.

తే. జలధిఁబుట్టిన యీపారిజాతవృక్ష
మఖిలలోకమ్ములకు సమ మదియుఁగాక
నామగఁడు శౌరి సిరి శచీనాథుకంటె
బల్లిదుండౌట యెఱుఁగరె యెల్లవారు.

క. నామగఁడు సత్యలోక
గ్రామణి దేవేంద్రుఁడాదిగాఁగల దివిజ
స్తోమములు గొలువనుండుట
యేమో పౌలోమి యెఱుఁగదే మఱచెనో.

క. తన బాహువిక్రమ
ఘనుఁడయ్యెడు నేనిఁ గృష్ణుఁ గయ్యములో మా
ర్కొని గెలిచి పారిజాతము
గొనిపోవంగాక యేల కొంకులు తనకున్. (8 ఆశ్వా. వ. 130-134)

ఈ పట్టున ముక్కు తిమ్మన్న సత్యభామచేఁ జెప్పించిన పలుకులు :—

సీ. వినుఁడు సురేశ్వరు వనపాలకులు వార్ధిఁ
బొడమిన యీదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె ? యింద్రుండు నెవ్వఁడు ?
తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ
డక్షుఁడై ధరియించె, నతఁడె చేకొనఁగాక
తెకతేర యిదేమి యొకరిసొమ్ము ?

బున వైకల్యంబు యాగంబునకుఁ బొడమ
నే భూసురశ్రేణి వేఁడ
న్నిను నావేశించి పంపెన్నృపయతఁడె
ంగు ఋన్విప్రకృతిశ్వేఁడు పాపా
మ్మని శాపమ్మైన శాపమ్మైన విడువు రయి
ల్లైన మేలింకనన్నన్. (రెండవ ఆశ్వాసము)

**4. విద్యార్థి యగు శశాంకుని యెదుట తార జూపిన శృంగార క్రమము :—**

సీ. బంగారు చెఱఁగుల పట్టుపుట్టముఁ గట్టి
కమ్మకస్తూరి తిలకంబుఁదీర్చి
ముత్యంపుసరులను మొఱపుఁదీగయుఁ బెట్టి
యావయవంబుల సొమ్ము లలవరించి
కలికి కన్నులయందుఁ గజ్జలంబమరించి
యరవాయకొప్పున విరులు దురిమి
తఱచుగాఁ గప్పూర తాంబూలములు సేసి
పాలిండ్లఁ గుంకుమ పంకమలఁది
తే. పొసఁగ వజ్రంపుఁ బాపట బొట్టు పెట్టి
రవళి మెట్టెల మ్రోతలు రాయడింపఁ
బంచసాయకు మోహనబాణమనఁగ
నింపు బింబాస్య మెలఁగు నమ్మందిరమున (ఆ. 6 ప. 15)

**5. ఊర్వశీ పురూరవ సమయ మందు పురూరవుని వన విహార వర్ణనము :—**

సీ. మందారచందన మాకందశాకోట
జంబీరనీప కదంబ తరులు
మల్లికా మాధవీ మాలతీ చంపక
కుందాది సంఫుల్ల కుసుమలతలు

కలనాద కలహంసికా చక్రవాక వి
స్తార కాసార కాసారములును
గీరసారాశతశారి కౌమ్యగభంగ
పగపుష్ప పరితుష్ట పరిచితంబు
తే. మందమలయానిలోద్ధూత సూనసుమప
రాగసూనరితా కాశ భాగతలము
గలిగి వనదేవతా సముత్కటగ మనోఘ
రామమై యొప్పచున్న యారామములను. (6 ఆశ్వా. ప. 68)

పై యుదాహరణములఁ బట్టి యీ కవివర్యుని శైలి సరళముగాను స్వాభావికముగాను రసోదంచితముగాను యున్నదని తెలియఁగలదు. శ్రీకృష్ణదేవరాయల కాలమందుఁ గవిపుంగవులలో నీతని నొకమేటి కవిగ బరిగణింపవచ్చును.

పురాణమును నొక రసవంతమగు ప్రబంధముగ రచించిన యీకవి ప్రౌఢ యాంధ్రుల యాదరణమునకు సర్వవిధముల పాత్రుఁడై యున్నాడు.

Printed at the Universal Printers, (Prop: Sramajeevi Press Ltd.) Madras.
Paper by T. P. 398